S.No 412 5882

శ్రీసద్గురుభ్యోనమః.

# శ్రీ అనుభవజ్ఞాన దీపిక.

ఇది

శ్రీమదద్వైత పరిపూర్ణ జ్ఞానానుభవనీయులైన
తనరగల కోటయార్యుల ప్రియశిష్యుఁడగు,

## వల్లభాపురపు కామదాసుచే.

వ్రాయఁబడి,

గండికోట - ఆదెన్నగారి ద్రవ్యసహాయంబుచే
ప్రచురింపఁబడి,

మచిలీపట్టణమందుఁడు

చెల్లా, నాగలింగశాస్త్రులవారి పుత్త్రుఁడగు

లక్ష్మీనృసింహశాస్త్రిగారి

స్వకీయ శ్రీ

ఆర్యానంద ముద్రాక్షరశాల యందు

ముద్రింపించి ప్రకటింపఁబడెను.

ప్రథమముద్రణము - 1000 ప్రతులు.

జిష్టడు కాపీరైట్. 1916 దీనివెల 0—2—0

శ్రీరస్తు

శ్రీసద్గురుభ్యోనమః

# శ్రీ అనుభవజ్ఞానదీపిక.

ఇది

శ్రీమదద్వైతపరిపూర్ణజ్ఞానానుభవనీయులైన

శనగల కోటయార్యుల ప్రియశిష్యుఁడగు,

## వల్లభాపురపు కామదాసుచే.

వ్రాయఁబడి,

గండికోట - ఆపెన్నగారి ద్రవ్యసహాయంబుచే

ప్రచురింపఁబడి,

మచిలీపట్టణమందుండు

చెల్లా నాగలింగశాస్త్రులవారి పుత్త్రుఁడగు

## లక్ష్మీనృసింహశాస్త్రిగారి

స్వకీయ శ్రీ,.

ఆర్యానంద ముద్రాక్షరశాల యందు

ముద్రింపించి ప్రకటింపఁబడియె.

రిజస్టర్డు కాపీరైట్. 1916 దీనివెల 0—2—0

1000—ప్రతులు.

# విజ్ఞాపనము.

ఆర్యులారా!

ఏ నీగ్రంథము నద్వైతపరిపూర్ణానుభవనీయులును, మద్గురుస్వాములునగు శ్రీయుత శనగల కోటయ్యగారి పాదసేవచే నాకు లభియించిన స్వానుభవజ్ఞానమున రచియించితినేగాని, పంచకావ్య ప్రభృతిలక్షణ గ్రంథములేవియుఁ బఠించియెఱుంగ. అందుచే లక్షణవిరుద్ధములగు నపభ్రంశము లనేకములుండకపోవు. ఐనను గుణగ్రహణపారీణులగు పండితగ్రామణు లిందున్న గుణంబులనే గ్రహించి, దోషంబులఁ బరిహరించి, నన్ను మన్నింతురని వినయపూర్వకముగా వేడుకొనుచున్నాఁడను.

10 - 8 - 1916
కొల్లిపర.

ఇట్లు



ఆర్యజన విధేయుఁడు,
వల్లభాపురపు రామదాసు.



# పీఠిక.



సీ. శ్రీగండికోట రా♦జితవంశవిమల దు
గ్ధాంభోధిపూర్ణ సు♦ధాకరుండు
చెన్నయార్యునకు ల♦క్ష్మీదేవియనెడు సా
ధ్వీరత్నమునకుఁ గు♦మారకుండు
వేదాంతవిద్యా ప్ర♦వీణుఁడౌ శనగల
కోటయాచార్యుని ♦ కూర్మిశిష్యుఁ
డాత్మవత్సర్వ భూ♦తానియంచాత్మలోఁ
దలఁచివర్తించు ని♦శ్చలదయాత్ముఁ

గీ. డైన శ్రీయాదెనాహ్వయుఁ ♦ డాదరమున
అనుభవజ్ఞానదీపిక ♦ యనెడుదీని,
నచ్చుఁగూర్పించిశాశ్వతం ♦ బైనఖ్యాతిఁ
గాంచెవీనినాదైవంబు ♦ గాఁచుఁగాత.

10-8-1916
కొల్లిపర.



ఇట్లు
ఆగ్నజనవిధేయుఁడు
వ॥ కామదాసు.



## అనుభవజ్ఞానదీపిక.

క॥ ననునీ భవబంధములం
దుననుండియుఁ దొలఁగఁదీసి ♦ తోరఁపుఁ బేర్మిన్
గనిజన్మ రహితుఁ జేసిన
శనగలకోటయ్యగురుని ♦ సంస్మరియింతున్ ॥

వ॥ మఱియు నిష్టదేవాభివందనంబుఁ గావించి యనంతరంబ ॥

గీ॥ అనుభవజ్ఞానదీపిక ♦ యనెడు దీనిఁ
గోటయాచార్యవర్యుని ♦ కూర్మిచేత
నాకులభియించినట్టి జ్ఞానంబువలన
వ్రాసినాఁడ శాస్త్రజ్ఞాన ♦ వాసనెఱుఁగ ॥

క॥ కావునఁ దప్పులుగల్గిన
భావంబున నెంచకుండఁ ♦ బరమకృపన్ సం
భావించి యొప్పులంగొనుఁ
డోవిబుధవరేణ్యులార! యుత్సాహమునన్ ॥

### ఆర్య ప్రార్థనము.



నాదనామక్రియ రాగము – ఆదితాళము.

అన్నలార నావిన్నపమును విని – మున్ను గదయజూడండీ।
ఉన్నతప్పులను – ఎన్నకననుమీ తమ్మునిగా నేలండీ॥ అ॥

1 పన్నుగ గ్రంథంబులు నే నెన్నడు – పఠియింపగ లేదండీ।
సన్నుతాత్ముఁడగు మాగురుకృపనీ – సరణి వ్రాసితినిజుండీ॥ అ॥

2 చదివితరుణమునఁ జెదరినపదములు ముదముననవరించండీ।
ముదముతో డమీపదముల కెరగెద సదయ నాదరించండీ॥ అ॥

3 కూరిమితో నా శనగలకోటయ – గురు నేగొల్చెదనండీ।
ధారుణి తోవల్లభాపుర కామ-దాసుని గృపజూడండీ॥ అ॥

## అనుభవజ్ఞానదీపిక.

### గణనాయకప్రార్థనము.

వసంతరాగము - అటతాళము.

మ్రొక్కెదా మ్రొక్కెదా - శ్రీగణనాథ॥ మ్రొ॥
మిక్కుటమైనపదవి - జక్కనివాక్కులియ్య॥ మ్రొ॥

1 ఆదివేల్పునీవేతండ్రి - భేదములుపీడజేసి।
పాదములుజూపిమున్ను - భక్తులనుబ్రోచినావు॥ మ్రొ॥

2 గణములుచక్కజేసి - ప్రణవమునడపుచున్న।
గణనాథపరముజూపి - కరుణతోడరక్షింపుము॥ మ్రొ॥

3 సోహమునీవేజ్ఞాన - భావముదెల్పినాకు।
మోహముదీసివేసి - మోక్షమొసగిబ్రోవనీకు॥ మ్రొ॥

4 వాసిగానుకొల్లిపుర - వాసుడవైయున్నావు।
దోసిలొగ్గియున్న కామ-దాసుని రక్షింపనీకు॥ మ్రొ॥

గీ॥ ముందునాసహస్రారమ్ము ♦ నందువెలసి
మెండుగావాయువిధమున ♦ నిండివెలుఁగు।
నట్టిగణనాథుఁగొల్వుము ♦ స్వాంతమందు
దళితభవదోషవినుకామ ♦ దాసవేష॥

### సరస్వతీప్రార్థనము.



మధ్యమావతిరాగము - అటతాళము.

వాణీనినునమ్మితీ - చతుర్ముఖ - రాణీరక్షింపగోరితీ॥ వా॥ వాణి
యలినీల - వేణిసత్పుస్తక - పాణీనాజిహ్వాను వసియించిబ్రోవుము॥ వా॥

1 రూపులేవిలేవు - సర్వలోకవ్యాపకమైనావు - ప్రాపునీవని న
మ్మిగొలచితి - పాపములనెడబాపిదయతో నాపలుకులందమృతమొలు
కగ - నాణెముగబరికించుతల్లి॥ వా॥

2 బాటదప్పకయొప్పుగా - జెన్నలరునా - మేటిశిఖరమునదీప్తిగా - కోటిసూర్యులకాంతిచేతను - కోటపేటలునిండివెల్గుచు - మేటిశనగలకోటయార్యుల - మాటనీవైయున్నతల్లి॥ వా॥

3 తల్లిదయజూడవే - దివ్యకల్పక - వల్లీననుగావవే - చల్లగాను కామదాసుకు - కొల్లగానువరమునిచ్చి - యెల్లలోకములందుపున్నమ - వెన్నెలైవెలిగేటితల్లి॥ వా॥

గీ॥ హంసవాహాను రాణి♦నాత్మలోఁదలఁచిన
భవములెల్లబాపి ♦ పరమపదవి
యందునీదుమనము ♦ నధివసింపఁగఁజేయు
దళితదోషకామ ♦ దాసవేష ॥

# అనుభవజ్ఞానతత్త్వములు.

ఆనందభైరవిరాగం - అటతాళము.

ఈశనినునమ్మితీ - అఖిలలో - కేశానినునమ్మితీ ॥ ఈశనాభవపాశములను వి-నాశనమునొనరించియోగి హృ-దీశనను రక్షింతువనికదు - నాశగొనినాహృదయమందున॥ ఈ॥

1 కామక్రోధములలో - బడనీయక -। కడతేర్పుముధరలో॥ నామభూపక్రియలులేక । నీమనిష్ఠలుబొందబోక ఈమహిందగుయచలమున సం॥ప్రేమమునసైక్యంబుజేయుము॥ ఈ॥

2 వేరుసేయకను - యెఱుకనుగూర్చి - యారుచక్రములను॥ అరుమూసిమేనుమఱచి - యారుజోడేనుగులగూర్చి - తీరుగానాసికాగ్రమున - దివ్యముగజెన్నలరునట్టి॥ ఈ॥

3 పంచభూతములను - గుర్తెఱిగియే - వంచన బొందకను॥ అంచితంబుగ నాత్మరాముని - యెంచినామది నుంచివేడితి - ద్రుంచినా కలుషంబులెల్ల - తూర్యమొందగ జేయుమయ్య॥ ఈ॥

4. అందముగా వేడితి । శనగలకోట। య్యాచార్యమదినమ్మితి॥ నందనుడవల్లభాపురపా । న్వయుడగామదాసుడనునిం । పొందగానీపాద పద్మము । లందుటకునైయాశ్రయించితి॥ ఈ॥

గీ॥ భూతనాథుండౌసర్వజ్ఞ ♦ మూర్తినెపుడు
హృదయపద్మంబునందున్న ♦ రింపుచున్న
నెల్లగలుషంబులనుమాఱి ♦ యించఁగలపు
దళితభవదోష వినుకామ ♦ దాస వేమ.

కాంభోజిరాగము - అటతాళము.

నందకుమార యా । నంద మొసగి వేగ । ముందుగ నన్బ్రోవరా॥
పొందుగమీపాద మందినందుకు వేగ । ముందుగ నన్బ్రోవరా॥ నం॥

1 ఇడాపింగళమధ్య - విడిపోనున్నావు ।
నడినాళమునపొన్న - పాన్పుపై వెలయునో॥ నం॥

2 ఆరుచక్రములపై - మేరుశిఖరముననున్న ।
ఓరామబ్రహ్మానా - కారోగ్య మొసగను॥ నం॥

3 నాదుబిందుకళ - భేదము దెలిసియు ।
సాధుసజ్జనులకు - పాదు దెల్పినతండ్రి॥ నం॥

4 భేదవాదములను - పామలణగద్రొక్కి ।
బోధరూపకమైన - సాధుభావముజూప। నం॥

5 కోదండపాణినా - కాపండధరునిచే ।
వేదండనము లేకా - మోదమునొందింపు॥ నం॥

6 కోటిలింగగురుని - గురుకృపగాంచిన ।
మేటికామదాసు - నేటికిబ్రోవవు॥ నం॥

గీ॥ సప్తచక్రంబుల ♦ సరసీజకీల - నెఱింగి
నిక్కఁబట్టిసాక్షి ♦ నేర్పు మీఱయు
చక్రాధిపతులను ♦ సన్నుతిఁగావింపు
దళితదోషకామ ♦ దాసవేమ॥

## అనుభవజ్ఞానదీపిక.

బిళహరిరాగము - అటతాళము.

కుండలవారము - శివుని - గొల్చుసేవకులము - దండిగదాస సేవకులము॥ కుం

ఆ పిండబ్రహ్మాండమునంటక - దండిగవెలిగే - నిండుజ్యోతిలో - నుండివెలయు బరమాత్మునిగాంచిన॥ కుం॥

1 కుండలుజరచుచునూ - అండముశోధన జేయుచును॥ దండిగ॥ సోహం సోహం బనుచును - నిండినప్రణవము - నిత్యముగాంచిన॥ కుం॥

2 ఆధారంబనే భూచక్రమున - ఓదారంబనె కుంభినిమట్టిని - పాదుదెలిసియు జతుర్దళమందున - పాకముబట్టిన హంసనుమరువని॥ కుం॥

3 స్వాధిష్టంబున నారుదళము లా - మోదముతోడ ద్వితీయ చక్రమున - ఆదినరూపము లేర్పరచినయనాదిబ్రహ్మసరస్వతిమరువని॥కుం॥

4 మణిపూరకమున మండివేసికొని - ధణధణయని దశదళముల మధ్యను। ఘణాఘణాయని ఘాండవజరచుచు - మణిలోవిష్ణుని లక్ష్మిని మరువని॥ కుం॥

5 అనాహతంబనె ఆవములోపల - పంద్రెండుదళములు గుణ ములుగూర్చి - శ్రీనివాసమనె చిహ్నసగాల్చుచు - నెంచి శివునిపార్వతినిన్ మరువని॥ కుం॥

6 పంచకమలమున పదియార్దళముల - నెంచిచూచి కావిళ్లు గట్టుకొని - యుచితముగ సీయిలలోజనులను - వాంఛతో జీవుదేటింటను దిరిగెడు॥ కుం॥

7 షడుచక్రంబున రెండుదళింబులు - చెడుగుడుగుడి యనిసోహం బ్రహ్మ - దండిపూజలకు ఘాండవపోయని - నిండీననాదము మెండుగ మరువని॥ కుం॥

8 కుండలాగ్రమున గురుతునిలుపుకొని - కుండలోన శివలిం గముగనుగొని - కూడినమోహము గూలద్రోచికను - బొమ్మలమధ్యను మూర్తినిగాంచిన॥ కుం॥

9 ధరణికొల్లిపర - పురమునునుండిన - గురువరు కోటయ్యార్యుల

కృపచే - స్థిరముగ కామదాసు హృదయమున - మురియుచు గురుపద మందియుండిన॥ కు౦॥

గీ॥ ఎంతగాఁ బ్రదికియుండిన ♦ నేమిఫలము
సంతకూటంబు సాధించి ♦ చింతలెల్ల
వీడి పరమాత్మునాత్మలో ♦ వేఁడుకొమ్ము
దళితభవదోషవిను కామ♦దాస వేష॥

బిలహరిరాగము - ఏకతాళము.

పంతముగాడకుగంతులువేయకు-మెంతగబ్రతికేవు-ఓమనసా॥పం॥
పాత్రుమఱచియు - భక్తినిలిపిన- న్ముక్తినిబొందవె-ఓమనసా॥పం॥

1 పసలేదు సంసారములోపల - విసుగుచుదిరుగకు మోమనసా దాసుడవై గురుప్రసాదమునకు - దోసిలియొగ్గవే యోమనసా॥ పం॥

2 గాలముమ్రింగిన మీనముతీరున - జాలినిజెందకు మోమనసా వాలాయముగా నాదమువినుచు - గనులానిచూడవె యోమనసా॥ పం॥

3 కంఠముపుచ్చిన శునకముగావడి - [illegible] బదిరుగకు మోమనసా - గట్టిగపెదవులు బంధనజేసియు సోహంబల్కవె యోమనసా॥ పం॥

4 తుదమొదలెరుగని త్రొక్కిడిమడుగులు - పదురులువదరకె యోమనసా ॥ తొండరపడకను - పొందితూర్యమున - నందముగనుగొను మోమనసా॥ పం॥

5 ఇడాపింగళవివరముదెలిసి - నడినాడిమధ్యగురునాథుని గనవే యోమనసా - వడివడిగాజెడుగుణములువిడచి - శాంభవిగూడవె యో మనసా॥ పం॥

6 మహినిశనగిలకోటిలింగగురు - మహిమనుగనుగానుమోమనసా । ఇహాముమఱచియాకామదాసుహృదయమునినమ్మవెయో మనసా॥

గీ॥ మాయగుణములెల్ల ♦ మానితేనేగాని
ముక్తిమార్గమునకుఁ ♦ బోవలేవు
అందుకాడిగుసువు ♦ న్నాశ్రయింపఁగవలె
దళితదోషకామ ♦ దాసవేష ॥

## అనుభవజ్ఞానదీపిక.

### ఆనందభైరవిరాగము - అటతాళము.

ఎన్నాళ్లు బ్రతికేవు - యేమిస్థిరమిదినీకు - కొన్నాళ్లకో వెళ్లేమనసా।
ఉన్న దినములయందు-తిన్న గాగురుజేరి - చిన్న బిళమునుగాంచుమనసా॥ఎ॥

1 ఆలుపిల్లలునీకు - కాలకింకరులనుచు - గేలిజేసిరిబుధులుమనసా।
ఫాలలోచనుసేవ - మేలుగాజేసియు - కీలుదెలుసుకయుండుమనసా॥ఎ॥

2 కఫవాతపైత్యముల్ - కప్పిగాబరచేత - తిప్పలనుబడుచుంటెమనసా।
కప్పిపెట్టినధనము - చెప్పుమనిబాంధవుల్ - చేరినిన్నడిగేరుమనసా॥ ఎ॥

3 ఆశలన్నియురోసి - మోసగాండ్లనుబాసి - కేశవునినుతిజేయుమనసా।
నాసికాగ్రమువీద-వాసిగాజేరుకొని-కాశిలోనుండవేమనసా॥ ఎ॥

4 కుండలీమార్గమును-మెండుగాదెలిసికొని-నిండుపరమందవేమనసా।
యెండవానలచలికి-నుండియుజమకని-దండిబయలునుగాంచుమనసా॥ఎ

5 మేటిశిఖరమునందు-చాటముగనిలుచుకొని-కోటిసూర్యులజూడుమనసా
కోటిసూర్యులకాంతి-దీటుగాదెలిసేటి-చోటునేమారకేమనసా॥ ఎ॥

6 నామరూపములన్ని నష్టంబుజేసిన-నీమంబుదెలియవేమనసా।
కామదాసునిమొర-ప్రేమతో నాలించి-సస్వరూపముబొందుమనసా॥ఎ॥

గీ॥ మహితమగుపరంజ్యోతి భ్రూవిమధ్యమందుఁ
గాంచితన్మయత్వంబునఁ ♦ గ్రాలునట్టి
యనఘచరితులకేదోష ♦ మంటబోదు
దళితభవదోషవినుకామ ♦ దాసవేష ॥

### బిళహరిరాగము - అటతాళము.

ఆటలాడించునోయమ్మా - సద్గురుబ్రహ్మం - బాటజూపించునే
కొమ్మా॥ ఆటలాడించును ఆత్మలన్నిటను నాటకుడాడించు - నాటరీతిగ
బొమ్మ॥ లాట॥

1 అన్నిటినంటినాడమ్మా- సద్గురుబ్రహ్మం-మున్నతానైయుండు
కొమ్మా॥ పన్నగతామర - మున్నెజలమంటనట్లు - యెన్నినోనేరూపులై-
యున్న పరమాత్ముడు॥ అ॥

2 మాటిమాటికిబల్కునమ్మా - సద్గురుబ్రహ్మం - మేటిశిఖరము

నంటుకొమ్మా॥ బూటకంబులనెల్ల - నాటకంబులగురు - వాటముగను చర్మ - నాటకబొమ్మల॥ నా॥

3 కోటయార్యుల వేడుమమ్మా - సద్గురుబ్రహ్మాం - పీఠాపై గూర్చుండుకొమ్మా॥ సాటిలేనట్టియా - మేటికేవలాత్మ - నాటికామదాసు సూటిదప్పకనిల్పి॥ ఆ॥

గీ॥ కన్నులమధ్యను ♦ చిన్నదానినిఁగూడి
పొన్నక్రిందఁబాన్పుఁ ♦ బొందుపఱచి
యున్నఁగన్నముక్తి ♦ యొప్పుగాఁగలదయా
దళితదోషకామ ♦ దాసవేష॥

కాఫీరాగము - అటతాళము.

చిన్నదీబల్ వన్నెదీ - అది-యెన్నశక్యముకానిదీ।
కన్నులారకనుమహాను - చిన్నబిళిమునను్న దీ॥ చి॥

1 అందమైనచిన్నదీ-బల్-పొందికగనూర్చున్నదీ।
ముందుగాగురుజేసువారికి - మోక్షమొసగెదనన్నదీ॥ చి॥

2 ఒంటిస్తంభముమేడలోపల - జంటలేకయున్నదీ।
అంటియంటకజగములెల్ల - నంటితిరుగుచున్నదీ॥ చి॥

3 కన్నెప్రాయముచిన్నదీ - అది-అన్నిమెఱుగికయున్నదీ।
పన్నగేంద్రునిపడగనీడను - పొన్నపైగూర్చున్నదీ॥ చి॥

4 కాంతితిమిరముగానిదీ - మహా-ఘనులకునెనమైనదీ।
మంతనంబునఁజింతమాన్ప - వింతపల్కులచిన్నదీ॥ చి॥

5 వాదభేదములేనిదీ - అది-సోహమనుచునుయున్నదీ।
సాధుసద్గురుకోటిలింగము - దాటివశమైయున్నదీ॥ చి॥

6 కామదాసుకుపరముజూపిన - రామబీజముచిన్నదీ।
కామరహితులగాంచిమోహము - గాంచునట్టిచిన్నదీ॥ చి॥

గీ॥ కొక్కుబోనుజొచ్చి ♦ చిక్కినచందాన
మిక్కిలాశఁబొంది ♦ తిక్కపరులు
దిక్కుఁగానలేక ♦ తిప్పలుబడుచుండ్రు
దళితదోషకామ ♦ దాసవేష॥

# అనుభవజ్ఞానదీపిక.

వసంతరాగము - అటతాళము.

ఎందుకే నీకిట్టిమోహము - ఓవెఱ్ఱిమనసా॥ ఎం॥

ఎందుకే నీకిట్టిమోహము - సందుదెలిసి ముందునీలో నందనూని గాంచివేడవే॥ ఓవెఱ్ఱిమనసా॥ ఎం॥

1 ఇల్లునాదని మెపుడుగోరాకే - ఓవెఱ్ఱిమనసా - పిల్లలబాంధవుల జేరకే। చల్లలోనవెన్నవలెను - నుల్లమెల్లదరచవలెను - కొల్లగాను నల్లనయ్యను - మెల్లగానుగొలచివేడవే యోవెఱ్ఱిమనసా॥ ఎం॥

2 శుక్తిరజితా మనుచువేడాకే - ఓవెఱ్ఱిమనసా । భుక్తికొఱకు జింతసేయాకే॥ భక్తినిలిపియుక్తిదెలిసి - శక్తికొలదిమదినిగురుని । ముక్తినొసగను ముందువేడావే - ఓవెఱ్ఱిమనసా॥ ఎం॥

3 అండపిండము మాయాయనే - ఓవెఱ్ఱిమనసా । యెండమావులను చునమ్మావే॥ ఆడదిమగవాడుగాక - యేడజూచినసందులేక । నిండియున్న దండిబయలు - మెండుగానుగాంచి గవయావే । ఓవెఱ్ఱిమనసా॥ ఎం॥

4 గురుప్రశనగలకోటియ్యార్యునీ - ఓవెఱ్ఱిమనసా । గురుతుగాను గొల్వు మదిబూని॥ గురుడు పరబ్రహ్మమనుచు - గురుతుదెలిసి కామదాసు । గురువరేణ్యునిమరుగుజేరెను - ఓవెఱ్ఱిమనసా॥ ఎం॥

సీ॥ స్థిరాత్ముండనై గురు♦ వెంతజేసి
ముక్తిమార్గంబునకుగల్గు ♦ మూలమెఱిగి
ధన్యుడవుగమ్ము తత్ప్రసా♦దమ్ముచేత
దళితభవదోష వినుకాము♦దాస వేమ ॥

ఆనందభైరవిరాగము - అటతాళము.

శ్రీకరముగ బ్రపంచమున్నాము - చీకటేమిగురువరా ।
ప్రాకటంబగు నెఱుకచేష్టలు - వరమేమెల్లగ శిష్యుడా॥ శ్రీ॥
1 నాకారమటంటిరేమి - దేమిటో సద్గురువరా ।
సాకారము సోహంభావము - జూచి తెలియర శిష్యుడా॥ శ్రీ॥
2 నిరాకారంబున్నదంటిరి - నిశ్చయంబెటు గురువరా ।
నిరాకారము రూపులేనిది - నిలిచి తెలియరా శిష్యుడా॥ శ్రీ॥

3 ఏవిధంబున నిరాకారము - జెందవచ్చును గురువరా ।
తవిలిపంచబంధములను - ద్రుంచగల్గిన శిష్యుడా॥ శ్రీ॥
4 పంచబంధములనగనేమిటొ - తెలియజెప్పుము గురువరా ।
ఎంచశక్యముకాదు పూర్వపు - జన్మదల్పుట శిష్యుడా॥ శ్రీ॥
5 తర్వాతనుబంధమేదో - త్వరగదెల్పుము గురువరా ।
ముర్వుచును తలిదండ్రులనుకొని - భ్రాంతిజెందుట శిష్యుడా॥ శ్రీ॥
6 ఉన్నమూడోబంధమేదో - ఆనతీయుము గురువరా ।
పన్నుగాయోనిభవమనుట యు-బద్ధమగురా శిష్యుడా॥ శ్రీ॥
7 అన్నసమ్మతి నాకుదెల్పవె - నాల్గొబంధము గురువరా ।
ఎన్నలేకనుపంచబంధము - లున్నవనుటరా శిష్యుడా॥ శ్రీ॥
8 ఇంకనేబంధమ్ములున్నవొ - విప్పిచెప్పుము గురువరా ।
ఇంకజన్మంబున్నదంచును - యెన్నుటొక్కటి శిష్యుడా॥ శ్రీ॥
9 మించియున్న సంచితాలవి - యెట్లుద్రుంతును గురువరా ।
మంచిసద్గురుసేవచే - నశించిపోవుర శిష్యుడా॥ శ్రీ॥
10 పంచబంధములణచినను నా-పైనినేమిక గురువరా ।
మంచితేజము వెలుగుచున్నది - పొంచిచూడర శిష్యుడా॥ శ్రీ॥
11 మేలుగా రేచకముపూరక - కుంభము లెటు గురువరా ।
గాలిపోకలాపినిల్పె - క్రమము తెలియర శిష్యుడా॥ శ్రీ॥
12 మూలముద్రాభావమేదో - ముందుదెల్పవె గురువరా ।
వాలుగాగాటూకపక్షుల - గదియమట్టర శిష్యుడా॥ శ్రీ॥
13 అంతరార్థము దెలిపిభక్తుల - చింతదీర్పుము గురువరా ।
ఉత్తబట్టబయలుకంటె - నేమిలేదుర శిష్యుడా॥ శ్రీ॥
14 రహస్యమొసగిన రామతారక - కోటిలింగ గురువరా ।
ఇహముగోసి కామదాసునై - యెలమినుండర శిష్యుడా॥ శ్రీ॥

గీ॥ హృదయమందుఁగురునిఁ ♦ జెదరకుండఁగఁబట్టి
పదిలముగఁ జరించు ♦ పరమపురుషుఁ
డవనిలోన సచ్చి♦దానందుఁడై వెల్గు
దళితదోష కామ♦దాసవేష ॥

## అనుభవజ్ఞానదీపిక.

### ఆనందభైరవిరాగము - అటతాళము.

గురుర్బ్రహ్మగురుర్విష్ణు - గ్గురుమహేశ్వరుడని - గురుతువదలక యుండుమనసా। గురువుసాక్షాత్పరబ్రహ్మబటుంచును - గురు తేజమందవే మనసా॥ గు॥

1 మాటలాడకనీవు - బూటకంబులుమాని - నాటకాధరుగాంచు మనసా। కోటపేటలుదాటి - వాటముగనీముఖ క-వాటమునజూడవే మనసా॥ గు॥

2 పరభామలనువలచి - పరద్రవ్యములగోరి - పరులదూషించకే మనసా। శరణాగతత్రాణ-బిరుదుగల్గినగురుని- సేవయేమారకేమనసా॥గు॥

3 అష్టగజములద్రుంచు - కష్టమనియెంచక - సృష్టిలోబడిపోక మనసా। అష్టదళపద్మమున- నిష్టతోజేరుకొని-యిష్టమున[illegible]మనసా॥

4 గంగయమునలమధ్య - సంగమంబో[illegible] యుండు మనసా। పొంగుచునుశృంగార - మందిరంబున[illegible] - [illegible]ంగిలను బట్టవే మనసా॥ గు॥

[illegible]ప్రాణ[illegible]లయుంచు - నాసాగ్రమునుగుర్తెరిగి - కాసనాస్థాణువు నుమనసా। [illegible]సతిస్థ-మండని భయముజెందకనీవు - భ్రమయేలనే వెఱ్ఱి మనసా॥ [illegible]

6 శక్తిమయమనుమనా-శక్తిబొల్లకనీవు - ముక్తిగోరుచునుండు మనసా। యుక్తిదెలిసినవారు - శుక్తిరజితంబని భ్రాంతిజెందరువెఱ్ఱిమనసా॥

7 పంచభూతమయంబు-ప్రపంచమాయనీ - సంచితాలనినమ్మ మనసా। నిశ్చయంబుగ గగనశూన్యమనియెంచియు - వంధ్యసంతనినమ్మ మనసా॥ గు॥

8 ముద్రలభావము - మూలంబుదెలిసియు - చిద్రూపమునువెల్గు చిన్మయునిజూడవే మనసా। భద్రముగశాంభవీ - ముద్రభావముదెలిసి-బుద్ధినిలుపుండవే మనసా॥ గు॥

9 నడినాళమునవెల్గు నాగస్వరూపుని - ముదియుచును జేరి ని-శ్చయముగానుండవే మనసా। వడివడిసద్గురు కోటిలింగార్యుచే - గేవలాత్మముబొందుమనసా॥ గు॥

10 క్షురమునుగాక యు-క్షురచిత్కళాతీత-భరితమైనీవుండుమనసా। స్థిరముగాకామదాస హృత్కమలమందుసుస్థిరభావమందవే మనసా॥గు॥

గీ॥ చల్లలోనవెన్న ♦ సమరసమైనట్టు
ఉల్లమెల్లదరచి ♦ యెల్లనరులు
నచలులగుచుగేవ ♦ లాత్మగానగవలె
దళితదోషకామ ♦ దాసవేష ॥

బిళహరిరాగము – అటతాళము.

గురునిగనవలెరా – సద్గురునిజేరవలెరా।
గురులోనదేజస్సు – గుర్తించవలెరా॥ గు॥

1 పంచభూతములను – వర్జించవలెరా।
సంచితములద్రుంచి – సముకంగావలెరా॥ గు॥

2 వాదభేదములను – వదలుకోవలెరా।
నాదబ్రహ్మమునను – నాటించవలెరా॥ గు॥

3 నాలుగుపీఠముల – నడుమకోట్టుడిరా।
కొట్టడిలోపల – కోమలున్నదిరా॥ గు॥

4 మూడుమూలలపెట్టె – మూతదీయవలెరా।
వేసిమూతదీసి నేపెను – భూతమున్నదిరా॥ గు॥

5 భూతమునెత్తిన – జ్యోతియున్నదిరా।
ధాతశంకరవిష్ణుల్ – దరిచిచూచిరిరా॥ గు॥

6 ముందుగానునిలచి – పొందియున్నదిరా।
ఎందుజూచినగాని – యేమిలేనిదిరా॥ గు॥

7 అందునిందునజూడ – నందియున్నదిరా।
సందుదెలిసినవారి – కందియున్నదిరా॥ గు॥

8 సత్యముమదినిల్పి – నిత్యుంగనవలెరా।
అ-సత్యదేహముమీద – నాశవీడవలెరా॥ గు॥

9 ఇంటిలోపలబుట్ట – జంటబాయకురా।
సాము-సరిశికోటి చార్యగురు – గూడవలెరా॥ గు॥

10 జంటతోపులనడుమ - జంటితేనేయురా।
అంటికామదాసు - మింటజేరేనురా॥ గు॥

గీ॥ సాధుపురుషులపదసేవ ♦ నల్పుచుండి
వాదభేదంబులెల్లను ♦ వదలివేసి
నాదబిందుకళలకాది ♦ పాదెఱుఁగము
దళితభవదోషవినుకామ ♦ దాసవేష ॥

బిళహరిరాగం - ఆదితాళం.

మంచిదీమంచిదీమంచిదీ - సద్గురునిసేవా। మ-దురునిపూజ॥మం॥

1 మంచిదిమంచిదిమంచిది - యుంచితముగనాత్మలోపల। సంచితములానుద్రుంచి - మించియున్న వెల్గునంటుట॥ మం॥

2 కోపతాపములనొందక - రూపములేకుండగోసి।
పాహాలనడుమనువెల్గె - నాపోజ్యోతినిజూచుచుంట॥ మం॥

3 ఫాలాభాగమందులీలా - వాలాలాడుటనుగాంచి।
మేలుగానుప్రణవనాద - మాలకించిలీలామగుట॥ మం॥

4 కోటిలింగగురుసూక్తులు - కామదాసుహృదయమందు। నాటిమేటియచలభావము - సూటిగానుబొందియుంట॥ మం॥

గీ॥ కన్నులకుమధ్యపున్నమ ♦ వెన్నెలందుఁ
జిన్నబిళమునవెలుఁగొందు ♦ చిన్మయాత్ముఁ
గాంచిముక్తుండవగుము మో♦గమ్ముచేత
దళితభవదోషవినుకామ ♦ దాసవేష ॥

నాటరాగం - అటతాళం.

వెయ్యరాబంధము-వెయ్యరా - సద్గురునిమరువక । దుర్గుణములాకు॥ వె॥ వెయ్యరాసద్గురునిమరువక - తియ్యరాయిలమోహజాలము। చెయ్యనానీమానసంబున - జెయ్యరాపరశివునిపూజ॥ వె॥

1 కోయరా-నీమొద్దుగుణములు - రోయరా - సద్గురునిమరువక కోయరా-కోపము - వీడరా। నయమునను భ్రూమధ్యసూత్రము - భయ

ముషంతయువీడిసిలో - రయమునసుముక్కంటిలోపల - జయముగా వెలుగొందుకళగని॥ వె॥

2 వెయ్యిరేకులనడుమరా - వెయ్యివిధముల - దృక్కుజెదరక నిల్పరా - అయ్యమీదను-భక్తినిల్పియుండరా - అయ్యచెప్పినద్వాదశాంతరి - చయ్యనాపతియించుకొనుచు - గయ్యముడిగిశోడశాంతరి । ఘనమహిమచింతాముద్రంచి॥ వె॥

3 అమ్మరా-సద్గురునిపాదము - నమ్మరా-సజ్జనులకు॥ అ॥ ఇమ్ముగానునిడాపింగళ - వివరమంతయుదెలిసిబాగనమ్మితిగ సహస్రారమందున నమ్మిబ్రహ్మముధావుగన్గొని॥ వె॥

4 అందునూ-ఇందునమోక్షము - జెందునూ - ఆనందమునగురువాక్కునమ్మిన॥ అం॥ అందుకైనేనచ్చుకోల - రామయార్యులకరుణచే నానందమొందినకోటయార్యుల - జెందినకామదాసురీతిగ॥ వే॥

గీ॥ వెలయునాయిడాపింగళ ♦ విడిదిజేరి
నాడినడుమనువెలిగేటి ♦ నాతిఁగాంచి
మేడఁగోన్కియాయ ప్ర♦మేయుఁగనుము
దళితభవదోషవినుకామ ♦ దాసవేష॥

సౌరాష్ట్రరాగం - అటతాళము.

పల్కవేమేభగవతీ - పరమందున॥ ప॥

1 పల్కవేమేభగవతి - యల్కలేలనునాపై ।
మొల్కనవ్వులమోము - గుల్కుచునుజూపించి॥ ప॥

2 ముందుతారకమంత్ర - మందియమనస్కమై ।
పొందుతూర్యమునీవై - సందులేకనునిండి॥ ప॥

3 ఆరుమేడలపైన - మేరుపర్వతమూన ।
కేరుచుసద్గురునిజేరి సోహమునీవై॥ ప॥

4 చతురాగ్రమునందు - పశ్చిమవీధిలో ।
నిక్షేపమూగవెల్గుసాక్షి భూతమునీవై॥ ప॥

5 సన్నబిళంబున - పున్నమవెన్నెవై ।
తిన్నగవెల్గుచు - వన్నెలుమించినదేవి॥ ప॥

6 పదునాల్గుభువనముల - కాధారమైయున్న ।
నాదాస్వరూపిణి నమ్మితినోయమ్మా॥ ప॥
7 కామదాసునికూర్మిగాచినాకోటయ్య ।
స్వామినివలచిన - జననీనమ్మిననాతో॥ ప॥

మధ్యమావతిరాగము - అటతాళము.

చిన్మయునిగూడవేడీనా-నీవు-సన్మార్గమునదిరుగుతోడివా॥ చిన్మయుని గూడియా - చిన్నబిళమునజేరి-తిన్నగావెలిగేటి - పన్నగేంద్రునిగూడి॥ చి॥

1 ఆరుగుణములస్నేహామువిడువు - నీవు-హరిహరాదులభ్రాంతులువిడువు- హరిహరబ్రహ్మాది - అమరేంద్రులెల్లను - పరమగురుడేయని విడివిగదెలిసికొని॥ చి॥

2 స్నానములలోపొందుమనాను - నీవు-సజ్జనులస్నేహంబుపూను ॥ నిర్జరాదులెల్ల - తపనులజేసియున్న - ధూర్జటిని సేవించి - వర్జితదోషులైనారు॥ చి॥

3 కాయముస్థిరముగామోను - నీవు - ప్రాయమునిల్వదనిదల్పు ॥ కాయంబులోన-సమపాయమును దెలిసికొని - ధీయుతుడవగుచునా - గాయత్రిసిపఠియించి॥ చి॥

4 మొండిమనసును చెండవలెను - నీవు - దండిగురుని జేరవలెను - నిండినపరమాత్మ - మెండుగా జేరుకొని - అండములపైకెక్కి - కుండలి - గలిసికొని॥ చి॥

5 దీక్షగట్టిగబూనవలెనూ - నీవు-సూక్ష్మవ్యాగము జేరవలెనూ॥ అక్షిగోళపల - నాడుపనుష్యక్షి - సాక్షిభూతునిగూడి - మోక్షమును బొందుచు॥ చి॥

6 పరిపరిగుణములను గుర్తుగా - నీవు-పరమార్థమును చాలగానమ్మూ॥ స్థిరభావమును నమ్మి - ధరికామదాసుడు - గురుకోటయార్యులను - మరుగూన జేరుకొని॥ చి॥

పలుకు - నాదనామక్రియరాగము - అటతాళము.

యోగముతో - మానసమున - నొక్కొకానునమ్మినాను । భోగి

నీరోవేకారావమ్మా - ఓముక్తికాంతా - భోగత్యాగా యోగామొన
గవే॥ ఓముక్తికాంతా॥

1 ఈషణత్రయమ్ములాను - పీడజాలకానునేను - మోసపోయి
యాశాజెందితీ - ఓముక్తికాంతా - దోషరహితుని జేసి-బ్రోవావే॥ యో॥

2 అంటూముట్టూలేనిబాలా - జంటపిల్లలైదుయిాసే - ఒంటదె
లిసీ - వెంటతిరుగూను-ఓముక్తికాంతా-కంటిపాప-నంటితిరుగునూ॥ యో॥

3 కోటలారుదాటవలెను - బాటజూపెబాలుదెవరు సూటిగాను
నాతోదెల్పవే-ఓముక్తికాంతా - ధాటివిూరఁగనిన్నెనమ్మితీ॥ యో॥

4 కుండలీస్థానమందూ - గంటతుమ్మెదగుంపులు - మెండు
గానునోదనుజేమూ - ఓముక్తికాంతా-గండికోట-కలికిబుస్సైనూ॥ యో॥

5 ముక్కుకొనసునిక్కి-చూచి-చక్కసిగోపురముస్నది- సుక్ష్మవా
తోనెంచిచూచితే-ఓముక్తికాంతా-ముక్కనలెసేభాగ్యమన్నా॥ యో॥

6 గట్టుమీదనొక్కటికి - కేకావేయగానువచ్చి గట్టుదెలిసినట్టు
మీరెనూ - ఓముక్తికాంత నిష్ఠతోడుతనిన్ను వేడితీ॥ యో॥

7 స్థూలదేహమందునిలిచి - కీలుదెలిసి వాలలాడిమేలుదెలిసిజోల
పాడితీ - ఓముక్తికాంతా - కీలకంఠునికిటుణాగదానో॥ యో॥

8 పంతమూడీగురుసిద్ధా - పంతకాడిబ్రహ్మరాత - చింత
దీర్చుని వేడితీ - ఓముక్తికాంత-నేచింతిడేనూ॥ యో॥

9 కోతిమొక్కటికొమ్మయెక్కి - సూటిగా నెరాతనొక్కి ధాత
వ్రాతతానతీసెను - ఓముక్తికాంత ధాత్రదైవము - ధరణిని నీవేను॥ యో॥

10 కుంటూవేసి-గుసగుసయాజ్ఞ - జంటగాతూముమింటపెట్టి - ఒంటి
దెలిసిపైరుపెట్టెరు - ఓముక్తికాంత-పంటపండి-అంగలావడదెన్నా॥ యో॥

11 మట్టికుండజాలోపలాను - దిట్టమైనచిలుకనైను - గుట్టుతోడుత
గురుని చేరెనూ - ఓముక్తికాంత-పట్టబోతేబయలైనిలచెను॥ యో॥

12 స్వానుదేశమూనచేరి - స్వానుభూతిమేనబూసిధ్యానముద్ర
లోనజూచితీ - ఓముక్తికాంత-కానరానికన్నేయున్నదీ॥ యో॥

13 కన్నెతోడగలసినవారు - యెన్నటికిపుట్టబోరు సన్నుతాంగి
యీకన్నెవునీవేగా-ఓముక్తికాంతా-తన్నునిన్నుమఱచిపోవలెగా॥ యో॥

14 నిర్గుణబ్రహ్మమునందు - నిర్వికల్ప సమాధిలో నిలిచినిన్ను నన్ను తలంచితి - ఓముక్తికాంతా-తలచిధర్మపదవిజెందితి॥ రా॥

15 ధరణికొల్లిపురమునందు-ధాముడైనకోటయగురుని-కరుణచే తకామదాసునై- ఓముక్తికాంతా-నిన్నుగాంచిసంతసించితి॥ రా॥

రెగుప్తిరాగం - అటతాళము.

తారకమునుజదువండీ - గురుని - కోరిభజించిగనుండీ-సద్గురు॥ తా॥ తారకమునుగురి - దగిలి తెలిసికొని - కోరికలెల్లనుగోసివేసికొని - దార కాంతలనుజూచితల్లులని - పారమార్థికముశోధనజేయుచు॥ తా॥

1 అండజయానునిజేరి-మొండుబ్రహ్మాండంబునుదగమీరి- మొండి మానసము - జెండియునిర్గుణ - పండితులెనయము - దండనలేదట॥ తా॥

2 మింటికిమంటికిరెంటికినడుమను - ఆంటకయున్నది - యొంటితా రకము - ఇంటిలోననా రెంటికిబైగా - గంటితోజూచి-జంటబాయక॥ తా॥

3 ఇడాపింగళనుజోడుగూడుకొని - నాడినడుమగురుజాడలుగను గొని మోడివేసికొని-కోడెపాముచు-జోడులేకయూడించుమార్గమున॥ తా॥

4 రాక్షసగుణములుకాల్చివేసికొని - సాక్షిబెట్టిపరదీక్షబూను కొనిపక్షివాహనునిపంకజనాభుని-చక్షులమధ్యమ వీక్షించియుగురు॥ తా॥

5 తన్నుయధార్థముగా- దెలియవలెను- తాబ్రహ్మమైనిల్వవలెను చిన్నవాండ్లమని-చిత్తములోపల-నెన్నదగదనే - సన్నదికనిపర॥ తా॥

ఇట్టితారకముపట్టిముందుగా - పుట్టుచావులులేవునిజముగా॥ వట్టి దనకను కోటయ్యగురుని - గట్టికామదాసుడుజెప్పెన॥ తా॥

గీ॥ దారసుతమిత్రమోహాబ్ధిఁ దవిలినరుఁడు
పారమార్థికచింత సఁపరుఁడుఁగాక
దారిఁగాకయముని బాధలకుఁజిక్కి
దళితభవదోషవినుకామ దాసవేష ॥

వసంతరాగము - అటతాళము.

పోతదీ - పగిలి - పోతదీ - ఇదిపచ్చికుండ॥ పో॥

1 పోతదీ యిదిపచ్చికుండ - పాతకంబులు జేసిమెండుగ।

మూతదీసిచెప్పకుండగ - దాతశంకరదలఁచకుండ॥ పో॥
2 ఆలుబిడ్డలయాసగలిగి - చాలమోహములోనమునిగి ।
వాలలాడుచు నీదులాడి కాలమెల్లనేలగలపి॥ పో॥
3 ఊరులోనోయడవిలోనో - దారసుతులచెంతనో ।
దారిలోనో యింటిలోనో - జీవిడచిదేహిసీతా॥ పో॥
4 ధనముధాన్యము జేర్చుకొని - బహుదినదినంబు లుందుననుకొని ।
సున్న జేసియన్ని యాశలు - గ్రన్ననమంటిలోగలిపి॥ పో॥
5 కోటపేటలు యేలుచును - మాటతప్పబలుకుచును ।
బూటకంబునబుద్ధినిల్పుచు - నాటకులనెరనమ్మినమ్మి॥ పో॥
6 తొమ్మిదిచిల్లులబాన - నమ్మదురయెంతజెప్పిన
కొమ్మునాదములోననున్న - సొమ్ములెత్తుకచూడకుండ॥ పో॥
7 ముందుగశ్రీకోటసూర్యుల - పాదమందికామదాసు ।
సందుదెలిసిదేహభ్రాంతిని - పొందుగా దానందెపరము॥ పో॥

గీ॥ ఆత్మలోనజ్యోతి ♦ యమరఁనలింగంబు
మత్తుఁదెలిసిగురుని ♦ మదినిసిలిపి
యాత్మనుబరమాత్మ ♦ నైక్యంబుసేయరా
దళితదోషకామ ♦ దాసవేష ॥

ఆనందభైరవిరాగం - అటతాళము.

ఆపోజ్యోతినిజూతమమ్మా - కన్నులమధ్య - జ్యోతివెలగుచుండు కొమ్మా - ఆపోజ్యోతినిజూతా - మాత్మాలోదప్పక - ప్రాపించివెన్గేటి యాపరంజ్యోతిని॥ ఆ॥

1 కుదురుగురుతు లేనిదమ్మా-బహు- గోప్యమైయున్న దేకొమ్మా -కదలదు మెదలదు - మొదలుతుదయు లేదు - అదరాదు బెదరాదు - ఆది పరంజ్యోతి॥ ఆ॥

2 సత్తుతానై యున్నదమ్మా - పొత్తునజూడ-చిత్తుతానై యుండు కొమ్మా - సత్తుచిత్తులరెంటి - సమరసముదెలిసితే - పత్తిరేకనువెల్గు పొత్తుమరచియుపరమ॥ ఆ॥

3 రూపాము లేనిదోయమ్మా - సర్వ - వ్యాపకమైనదేకొమ్మా
పాపాలనడుమను - పరిపూర్ణముగజ్యోతి - రూపామేమెఱుగక - దీపించు
చున్నట్టి॥ ఆ॥

4 అంగములోననోయమ్మా - జూడ - లింగమె వెల్గునేకొమ్మా
గంగయమునలమధ్య నంగానసర్వమై - నంగమేమియు లేక - పొంగు
చునున్నయూ॥ ఆ॥

5 అండపిండములయందమ్మా-జ్యోతి- నిండి వెలుగుచున్నదమ్మా
మొండిమూనసాము-చెండియునిర్గుణ_దండిగ సోహమని మెండుగబల్కేటి॥ ఆ॥

6 పరమార్థమైయున్నదమ్మా - వేరే- పరిపరిగతులేలాకొమ్మా
గురుకోటిలింగమ●ధర కామదాసునకు-స్థిరమనిజూపిన పరదేశమార్గమున॥

గీ॥ దేహమెల్ల సాక్షి ♦ తేలిపోవకమున్నె
సోహమనుచుంబరము ♦ జూడవలయు
దేహముడుగనంత - దేశ్యైనెపోదువు
దళితదోషకామ ♦ దాసవేష॥

శుద్ధకాంభోజరాగం - అటతాళము

చుట్టులింగముదిరుగుచుండగ - నట్టనడుమను మేల్మిబంగరుచాయ
గలిగినచిన్నదీ-మాటకుమాటకుబరముజూపునమత ముజంగముచిన్నదీ॥

1 ఆటపాటలనంట కెప్పుడు - మింటిమీదనెయున్నదీ।
బూటకంబులు-నాటకుండగ-పాటపాడుచునున్నదీ॥ చు॥

2 కంటిసనుమనుజంట లేకను - యొంటరిగదానున్నదీ।
ఇంటయింటననేక సారులు - యెపుడుదిరుగుచున్నదీ॥ చు॥

3 మూడురంగుల మేడలో జల-క్రీడలాడుచునున్నదీ।
నేడుశనగలకోటసూర్యులు - వాడుచున్నచిన్నదీ॥ చు॥

4 దోసిలొగ్గినకామదాసుని - గాసిమాన్పినచిన్నదీ।
వాసిగాపరశివునిపాదము - లందజేసియున్నదీ॥ చు॥

గీ॥ ముందుగురుమూర్తిపాదంబు ♦ లందిపివపం
బొందుగానష్టగజముల ♦ పొగరణంచి

చిన్మయాకారు నెపుడు వీక్షించుచుండు
దళితభవదోషవినుకామ ♦ దాసవేష ॥

ముఖారిరాగము - ఏకతాళము.

లేదు లేదుజన్మా - చిన్మయుని జేరితే॥ లే॥

లేదు లేదుచిన్మయునీ జేర - పాదు తెలిసియోంకారముతానై - నాదమఖండము-శోధన జేసిన॥ లే॥

1 పొందుగాను తారక-మందియుపిదప-అందుగని వెన్నెల - నాదు బిందుపాదు తెలిసి-భేదావాదములణగద్రొక్కిన॥ లే॥

2 మాటిమాటికి మరువక - ముమ్మూర్తులమైన - చోటు నేమారక-మూటి నారిటిగెల్చి యావల-కోటిసూర్యులకాంతిగలిసిన॥ లేదు॥

3 గట్టిగా పెదవులు - బంధన జేసి - గుట్టు తెలిసిమదిలో। కొట్టివేసి యింద్రియములన్ని - గట్టిగాకాటూకపక్షులపట్టుకొనే యాక్రమము నె తింగిన॥ లే॥

4 ఫాలభాగమునందూ-కోటయ్యగురుని- లీలమరువకముందూ॥ వాలలాడుచు-కామదాసు - మేలుగాగురుపాదమంది - చాలా తెల్విలోలుడైనా॥ లే॥

గీ॥ ఉదరమునను౦డిజీవుండు ♦ గుదమునంటి
వెనుకముందుసహస్రార ♦ వీక్షకడుగు
నాదిలోజీవు నేమార ♦ కాత్మయందు
దళితభవదోషవినుకామ ♦ దాసవేష॥

భూపాలరాగం - అటతాళము,

హరిహరిఓజీవ - అన్ని జన్మములల - ఈరీతిజన్మించిపోరు జేసియుగురు - దారిలోగనుగొంటిమేలుకో - హరి-అంసోహమునగురుని - పాదాబ్జములనెపుడు - నెఱిగిసేవించితి-అంసోహమనిజీవా॥ మేలుకో॥ హ॥

1 ఆధారచక్రమున - నాల్గుదళములమధ్య - పృథివీతత్వము క్రియా - శక్తివేగముగాను మేలుకో - అదిలోనేగురు - చాలగణపతికారు - వందలప్రణవాము - లక్షణమును కేసి - అంసోహమనిజీవామేలుకో॥ హ॥

2 స్వాధిష్టచక్రమున - నారుదళములమధ్య - ఉదకతత్వముజ్ఞాన శక్తివేగముగానుమేలుకో - ఆదిబ్రహ్మసరస్వతికారువేలు-ప్రణవమర్పణ జేసి - అంసోహామనిజీవామేలుకో॥ హా॥

3 బీజాలుపదిమణి - చక్రములోపల - తేజోతత్వముయిచ్ఛాశక్తి-వేగముగానుమేలుకో - బాజారులకునాధు - డాలక్ష్మిపతివిష్ణు - కారువేలప్రణవ - మర్పణముగ జేసి - అంసోహామనిజీవామేలుకో॥ హా॥

4 అనాహతచక్రమున - పదిరెండుదళములు- అనాదిశక్తివాయుతత్వము వేగ మేలుకో - ఆనందమునజూడు - మహాదేవగారికి - నారువేల ప్రణవమర్పణముగ జేసి - అంసోహామనిజీవా॥ మేలుకో॥హా॥

5 విశుద్ధచక్రమున - విభవమైపదియారు - దళములుపరాశక్తి - ఆకాశతత్వముమేలుకో - వాసిగానుసదాజీవునకు వెయ్యి - ప్రణవమర్పణ జేసి - అంసోహామనిజీవామేలుకో॥ హా॥

6 ఆజ్ఞేయచక్రమున - హంసతోగూడిన - అంగనమణిజీవా - తత్వముశివశక్తిమేలుకో - గంగాయమునలమధ్య-శృంగారముగ రెండు - బీజములప్రభో - ఆత్మునకువెయ్యిప్రణవమర్పణ జేసి - అంసోహామని జీవామేలుకో॥ హా॥

7 సహస్రారచక్రమున-వెయ్యిదళములమధ్య - మహాశక్తిమూల ప్రకృతితత్వము వేగామేలుకో - సోహమైరాంబీజా - మందుకోటిలింగ - గురువునకువెయ్యిప్రణవమర్పణ జేసి - అంసోహామనిజీవామేలుకో॥ హా॥

8 వెలసియిరువదొక్క - వేలనారునూరు - ప్రణవమై శిసగల కోటిలింగాచార్యమేలుకో - వల్లభాపురపుకామ♦ దాసుహృత్పద్మమున- జీవుడై భావింప-దేవుడైపరమూస-అంసోహామనిజీవామేలుకో॥ హా॥

సీ॥ గురువునూక్తియందు ♦ గురికినిల్పిసిలోనం
తెలంగునదుర్గుణములు ♦ చెండివేసి
పరమవెల్గుంబట్టి ♦ ప్రమదంబునొందరా
దశితగోపకామ ♦ దాసవేష ॥

## అనుభవజ్ఞానదీపిక.

### హిందుస్థానికాఫీరాగం - ఏకతాళము.

### మంగళహారతి.



మంగళామనిమంగాళమని - మంగళామనిపాడరే - శ్రీరామగురు
నకూ - అంగసంగములేకవెల్గు - నాత్మారామునకూజయ॥ మం॥

1 స్థూలదేహమెల్లముందు - చాలపట్లమొకటిజేసి అల్లశక్తులెదు
గూడి - పల్లెరంబుజేతబూని - కొల్లగానుసూక్ష్మవత్తి - మెల్లగానువెల్గు
బట్టి॥ మం॥

2 కారణంబనేటిదేహము - కరుగబెట్టిచమురుబోసి యెరుకమరు
పులేకయెపుడు - నేకతీరుగానుయున్న - పరమగోప్యధీరునకు॥ మం॥

3 అంగనామములెల్లగూడి - గంగయమునమధ్యమందు నిస్సంగు
డైనరామగురునకు - భంగమేమిలేకజయ॥ మం॥

4 ఇడాపింగళవిసరమెక్కి - నడినాళమందురామగురుని విడిదిజేరి
వెన్నెలందు - నిండుబయలునాకుజయ॥ మం॥

5 బట్టబయలటంచునిన్ను - దిట్టముగనమ్మినాను - కొట్టిమాన్పు
దుర్గుణములు - కొదువలేకనూ - గట్టిగానుపాదములు - దిట్టముగనమ్మి
నాను - అట్టిరామగురుప్రసాదు - సమితమంగళం॥ మం॥

6 పరీధావినత్సరమున - మార్గశీర్షబహుళమందు - మురియుచు
ముక్కోటిలోను - సమైక్యమునుబొందుగురునకు। మం॥

7 సోహమనుచునెపుడుతల్లి - అహమనేతండ్రిగూడి-అహంపహి
తయచ్చుకోల - రామగురునకుజయ॥ మం॥

8 మేరుశిఖరమందునిలిచి - నట్టియెచ్చుకోలరామ - దేశికావిరా
ట్టునీవు - కోటిసూర్యనాకుపదము - సూటిగానుచెల్పి నట్టినాటిమంగళం॥

గీ॥ గంగయమునలమధ్యను ♦ సంగమందు
సంగనగ్గూడికర్పూర ♦ మంగళములు
లింగమూర్తికినిత్తురు ♦ సంగమెక్కి
దళితభవదోషవినుకామ ♦ దాసవేష ॥

సురటరాగము - అటతాళము.

మంగళము మంగళం - సద్గురురాయ॥ మం॥

సాంఖ్య తారక యోగ-సరణి దెలిపిన-ముఖ్యమైనగురునిముందు వేడి-అక్కారొచక్కగ - హారతి వెలిగించి - సౌఖ్యమొసగు గురుకోటిలింగ మునకు॥ మం॥

1 పంచశక్తులబట్టి - పళ్లెమొక్కటిజేసి - సంచితములనెల్ల - చమురుబోసి - యంచితముగ గురు - నాత్మలో వెలిగించి - మించియున్నిటినంటి యంటకున్న గురుకోటిలింగమునకు॥ మం॥

2 ఆదివారమురోజు నాత్మలో భానుడై - అందముగనారువరుసాలతో - నిందువారమునాడు - పొందుగ చంద్రుడై - ముందుఫలము దెల్పిన-గురుకోటిలింగమునకు॥ మం॥

3 అంగములోనున్న - లింగముగనుగొని - సంగములోగురునిసంజ్ఞదెలిసీ - శృంగాటమున వెల్గు - పొంగుచునున్నట్టి నిస్సంగుడైనగురుకోటిలింగమునకు॥ మం॥

4 ఫాలభాగమందు - నాలలాడుగురు - లీలగనికామదాసు-మేలుగాను - చాలగకర్పూర-జ్యోతి వెలుగబట్టి - మూలమిచ్చినగురుకోటిలింగమునకు॥ మం॥

గీ॥ పరముకొఱకుభక్తి ♦ భావంబులోనిల్పి
గురువుపాదసేవ ♦ గుఱిగఁ జేసి
హారతియనరోరి ♦ యాత్మలింగమునకు
దళితదోషకామ ♦ కామదాసవేష ॥

పరిపూర్ణానుభవసీయులగు శ్రీశనగలకోటయాచార్యుల వారు
చెప్పినతత్వములు.

సురటరాగము - అటతాళము.

సమ్మతినయ్యా - ఓరామయ్యా - రామబ్రహ్మం॥ స॥
సమ్మతినయ్యా నా-సమ్మతితోడత - నిమ్మైనరామధర్మ - సొమ్ము జూపేవాని॥ స॥

# అనుభవజ్ఞానదీపిక.

1 తల్లిదండ్రిదాత - దైవముగురుడని - యుల్లములోనమ్మి ।
కొల్లగానుంటిని - యెల్లవేల్పులనేమిదలచబోనయ్యాఓరామయ్యా ॥ న॥

2 గురుమంత్రగురునిష్ఠ - గురుతునిలుపలేక - మర్మముదెలియక ।
పరుగులుబారేటి - పలువనైతినిగా - ఓరామయ్యా॥ న॥

3 ఆలుబిడ్డలుమీద - నాశలుమదినమ్మి - చాలజన్మాదుల ।
పాలైతిదెలియక - వీలుగాబ్రోవునీ - పాలబడితినయ్యాఓరామయ్యా॥ న॥

4 చలముతోడుతనన్ను - ఫలములుదెమ్మని ।
సొలసిసమాధిలో - నిలచియున్నావా - ఓరామయ్యా॥ న॥

5 తమచుట్టుదిరిగిన - దయలేకుండగవెత్రి ।
భ్రమలబెట్టదలచి - పలుకకున్నావా - ఓరామయ్యా॥ న॥

6 ఎడమకుడినదిరిగె- యిడాపింగళమధ్య- నాడినడుమనుమెరసె-
జాడజూపయ్యా-ఓరామయ్యా॥ న॥

7 హరినిష్టా-హరిదీక్షా - అచ్చుకోలరామ - పరమజూపితివని
స్థిరముగకొల్లింగ - దాసుడనైవేడితి - ఓరామయ్యా॥ న॥

## అనుభవపద్యములు.

సీ॥ నిత్యంబుసత్యంబు ♦ నిఖిలమానవులకు
నిజముగాఁదెలియుట ♦ నిష్టభక్తి
భక్తిభావంబునఁ ♦ బాటించినిలిచితే
భయములన్నియుఁదొలఁగి ♦ జయముఁగల్గు
భయమైనజయమైనఁ ♦ బరమాత్మగురుఁడని
భావించువేమేలు ♦ పథముతరయ
గురువాక్యమునునమ్మి ♦ గుణములనొకటిగా
సంఘటించుటయోగ ♦ సాధనంబు ॥

గీ॥ ఇంద్రియముల మొదట ♦ నిట్టట్టుఁబోనీక
కట్టుఁగట్టిభక్తి ♦ మట్టుపరచి
దివ్యదృష్టిలోనఁ ♦ దీపించిచూచితే
భ్రమతొలగిపోదే ♦ భావమందు ॥

శిలలనుబూజింపరు ♦ మఱిఁ
గలనైన నునన్యదృష్టిఁ ♦ గాంచరుమదిలోఁ
విలసిల్లుచు ♦ గురుభక్తినిఁ
దలపుచుఁబూజింపుచుంద్రు ♦ ధన్యాత్ములిలన్

గీ॥ తారకంబె మొదలు ♦ తత్త్వమార్గమునకుఁ
దారకంబువలనఁ ♦ దనువుఁగగ్గెఁ
దారకంబుఁదనకు ♦ ధర్మంబుఁదెల్పును
తారకంబుఁదెలియ ♦ ధన్యుఁడగును॥

సీ॥ మునుచెప్పినట్టియా ♦ మూలనాతారక
ధ్వనిలోనఁగలపియుఁ ♦ దలఁగకెపుడు
హంసమంబులనియెడు ♦ నక్షరంబులు రెండుఁ
బట్టుగాఁనోనరించి ♦ ప్రజ్ఞమీఱ
నలుయిడాపింగళ ♦ యనునాడిలోఁగూడ
సోహంభావంబునఁ ♦ జోద్యమలర
హంసోహమనుమను ♦ సంధినిఁజేరిసగుచు
నుచ్ఛ్వాసనిశ్వాస ♦ కరూతమగుచు॥

గీ॥ నిరువదొక్కవేయునార్నూఱు ♦ వెలమిహంస
రేయుఁబవలునిల్పగల సంచరించుచుండు
నజపగాయత్రియనిపేరి ♦ ననఁగవలయు
నాత్మయనఁగను దానమే ♦ యఖిలమునకు॥

సీ॥ నాసికాగ్రముమీఁద ♦ నయనద్వయంబుల
నునుమదిన్నిల్పిన ♦ నయనమండు
నద్వైతనదనూవు ♦ నదెస్వయంబగు జ్యోతి
యదెయాఖిలమునకు ♦ నాశ్రయంబు
నదెయింద్రచక్షువు ♦ నదెయమ్నుతపుఁదర్క-
నదెబ్రహ్మమనఁదగు ♦ నాత్మలోన
నదెస్వప్రకాశంబు ♦ నదెచిన్మయాకార
మదెసర్వసాక్షియై ♦ యలరుచుండు॥

గీ॥ నట్టివెల్గుగనుగను(గొని ♦ యాత్మలోన
సూర్యచంద్రాదులనునొక్క ♦ చోటఁజేర్చి
సూక్ష్మద్వారంబుఁగనుఁగొని ♦ సూటిగాను
ముక్తిఁగాంతురు పెద్దలా ♦ మోదమలర ॥

క॥ ముద్రలకందని ♦ దది యే
తద్రూపములందుఁబడక ♦ తానొక్కటిగాఁ
జిద్రూపంబై ♦ వెల్గుచు
భద్రముగానుండునట్టి ♦ పథముంగనుఁడీ॥

---

శ్రీమంపె నరసదాసుగారు చెప్పినతత్వము.

కాంభోజిరాగం - అటతాళము.

చూడరారెవిూర్వ్యముకలరిగ- నాడుచుబాడుచుహరిభజనా-వాడ వాడలను జే వెలుపుపుష్పలు-చూడగలిగెనరిహరిభజనా॥ చూ॥

1 మింటికిమంటికి వెంటికినసుమను - అంటకయున్నదిహరిభజనా- ఇంటిలోననావెంటికిపైగను - కంటితోజూడరెహరిభజనా॥ చూ॥

2 కోపతాపములుకోసివేసికొని - చూపునిలిపినదిహరిభజనా- పాపలకావలనాపోజ్యోతిని నిలిపిచూచినదిహరిభజనా॥ చూ॥

3 ఇడాపింగళను కోడుకూడుకొని-జాడలుగన్నదిహరిభజనా_మేడ లోపలను-కోటెపాముసాడించిచూచినది హరిభజనా॥ చూ॥

4 అంచితముగగురు - చెంతజేరుకొని - సంచితముడుగుటహరి భజనా_అచ్చుకోలరామయ్యనుగనుగొని-దాసులమైనదిహరిభజనా॥ చూ

5 అండపిండబ్రహ్మాండములోపల - నిండియున్నదిహరిభజనా ॥ మంపెనరసాదాసునిమదిలో - మరువకయున్నదిహరిభజనా॥ చూ॥

ఇరపాని బాలదాసుచెప్పినతత్వములు.

---

హిందుస్థానికాఫీరాగం - అటతాళము

ఏటికెదురుసడువవె - నీ-బూటకంబులుమానవే- కాటూకపత్తుల రెంటి - గలసిమధురముగ్రోలవే॥ యే॥

1 గంగాయమునసరస్వతియు - ప్రాంగేస్థలమునుగోరవే సంగతి

సగ్గు శిలో త్తిని - స్థానము సేవించావే॥ ఏ॥

2 పైనాస్నానము జేసితేనీ - పాపము నెడబాయునా ఆత్మస్నాన ముగోరితేనీ - కందున శ్రీనామము॥ ఏ॥

3 కాశీయాత్రలు జేసితే - నీ-కర్మము నెడబాయునా వాసిగ సహస్రారదళమున - వరలు కాశిని గోరవే॥ ఏ॥

4 ధరణిలో కోటయ్యార్యుని - దాపున జేరినందుకూ పరముదొరకెను ముక్తియిదిగో - పట్టుమని బోధించెనూ॥ ఏ॥

5 వాసిగ నిరపాని బాల - దాసూనిదయ జూడరా భాసురమ్ముగ పరమపదవికి - దోసిలొగ్గియుంటిరా॥ ఏ॥

కాంభోజిరాగం - ఆదితాళము.

1 అందరు శ్రీరామయందరు - శ్రీరామచంద్రా॥ అ॥ అందరు శ్రీరామయందురు - యిందులోన నెవరినిబ్రోతు వింది కేశ నాకుగల్గిన - సందియమ్ము దీర్చుతండ్రి॥ అం॥

2 దండిలుబుడుధనముకాసించీ - శ్రీరామచంద్రా॥ ద॥ దండిలు బుడుధనముగోరి - వడ్డికివడ్డీలు బెంచి - వడ్డికొచ్చిన సొమ్ము బెట్టి - వాహనాలు చేయించుచు॥ అం॥

3 చోరుడు పరధనముగోరియూ - శ్రీరామచంద్రా॥ చో॥ చోరుడు పరధనముగోరి - చొప్పించి కన్నము వేసి - దొరకితే నుధనము నాకు-ధన్యుడననుకొందురయ్యా॥ అం॥

4 స్నానసంధ్యజపము జేసియు - శ్రీరామచంద్రా॥ స్నా॥ స్నానసంధ్యజపము జేసి-పన్నుగా సీనామము దలచి - పన్నగేంద్రుని దాసుని జూచి యిల్లు వెళ్లగొట్టుదురయ్యా॥ అం॥

5 భక్తులామని పొగడుచుందూరు - శ్రీరామచంద్రా॥ భ॥ భక్తులామని పొగడుచుందురు - యుక్తియేమొ తెలియాలేక - చక్కని స్త్రీలను జూచి వెక్కసములాడుచుందురు॥ అం॥

6 ధరణిలో కోటయ్యాగురూని - శ్రీరామచంద్రా॥ ధ॥ ధరణిలో కోటయ్యాగురుని - దాపుజేరి వేడాగాను - ఓరికాకికో వెలరెండు - క్రమము దెలుసుకనడువామనెను॥ అం॥

7 వాసిగానాగయ్యాదాసూనీ - శ్రీరామచంద్రా॥వా
నాగయ్యాదాసుని - వాత్సల్యామునబ్రోతువని - ఆశపాశముగా వేసి-
దోసిలొగ్గియున్నాతండ్రి॥ అం॥

ఉయ్యూరు రామదాసు చెప్పిన తత్వములు.

నాదనామక్రియరాగము - అటతాళము.

నీవూవెళ్లేనాడు నీవెంటరారెవరు - నిజముగ తెలుసుకో మనసా।
నీవెంటపదుగురు - నినుబట్టనలుగురు - నినుసాగనంపుదురు మనసా॥ నీ॥

1 ఇంటిముందర యింటివెనుక - నీదుబలగమెకాని - నీతోటిరా
రెవరు మనసా। నోటిమేళాలాతో రొమ్ముతప్పెట్లతో - నినుకాటికంపు
దురు మనసా॥ నీ॥

2 ఇంఢ్లువాకింఢ్లు - గట్టించితివనుచూ నీవెందుకులికేవు మనసా।
నీలోనవెలిగేటి - జ్యోతిచల్లారితే నిన్నుంచరేయింట మనసా॥ నీ॥

3 కఫముపైకెగదట్టి - కనులూమూసుకపోయి - కడుకష్టపడు
చుంటే మనసా। హెచ్చుగధనము నీ-వెచ్చాటదాచితివో - చెప్పామందు
రునిన్ను మనసా॥ నీ॥

4 తొమ్మిదివాకిళ్ల-తోలుయెముకలతిత్తి- త్రుంగిపోవుచురుంగు
మనసా - భార్యాబిడ్డలమీద - భ్రమలుచూరవిడచి - హంసోహమను
చుండుమనసా॥

5 తొలిజన్మముననీవు జేసినపుణ్యమున-నరజన్మగలిగేనుమనసా।
మలిజన్మమునుమరచి- నరహరినినమ్మితే-ముందుజన్మములేదుమనసా॥నీ॥

6 పాలుపంచదారా మాంసభక్షణజేసి - యేలకండలుబెంచ
మనసా-కూలిపోయినవెన్కక-కాటిపాలేకాని-కొనసాగబోవలెమనసా॥నీ॥

7 కొల్లిపరపురమందు-శనగాలకోటయ్యా-గురునిపదములునమ్మ
మనసా।చల్లగానుయ్యూరిరామదాసుకోర్కె-సఫలముజేయూవేమనసా॥

కీర్తన నాదనామక్రియరాగము - అటతాళము.

పల్లవి ఎందువెదకినగానరానిది - బిందుసృష్టికిముందునున్నది - ఎక్కడున్నదిచూడరా - దానర్థమేమొచెప్పరా॥

1 ముందువెనుకనిండియున్నది - సందుగొందులుదిరుగుచున్నది। పొందుగాసద్గురునిపాదము - లందునామరినిలిచియున్నది॥ ఎం॥

2 నాటలేదుమూటలేదు - యెంచినాయేడింటలేదు- ఒంటిస్తంభముమేడమీదను జంటకోపులనంటియుండెను॥ ఎం॥

3 శాస్త్రవాదులకందరానిది - సూత్రవాదులజెందరానిది।యాత్రలందునగానరానిది - మంత్రములకుదొరకకున్నది॥ ఎం॥

4 ఏమిలేనిదియేమిగానది - లోకమంతాయెరిగియున్నది। తామసములేకుండనాకస - వీధులందునదిరుగుచున్నది॥ ఎం॥

5 ఎండవానకుజడియకున్నది - నిండుబయలులోనిలిచియున్నది। అండపిండాజాండమంతానిండినిబిడీకృతముగనున్నది॥ ఎం॥

6 ఎంచిచూచితేనేమిలేనిది - పంచభూతములందునున్నది_అంచితంబుగకోటయార్యుని - అండజేరినిండియున్నది॥ ఎం॥

7 ముందుగాడయ్యార్యు-రామదాసుహృదయామునిండీ-పొందుగాపరమందజేసి - సందులేకానిండియున్నది॥ ఎం॥

నాదనామక్రియరాగం - అటతాళము.

వాదభేదములేలరా-గురుబోధదెలియకగాదురా మతవాదులను విడనాడిగతికి - దారియేదోచూడరా॥ వా॥

1 అంటియుంటాదేదిరా-యిక-అంటితిరిగేదేమిరా- అంటియుంటక వెంటనంటి - జంటగిరిగేదేమిరా॥ వా॥

2 పాటపాడేదేమిరా-యిక - ఆటలాడేదేమిరా - పాటయాటల మధ్యనిలిచి - పల్కుబల్కేదేమిరా॥ వా॥

3 చూపునిలిపిందేమిరా - మఱి-చూచిచూడందేమిరా చూపు రూపునేకమైతే - నిల్చిపోయిందేమిరా॥ వా॥

4 దాపుజేరిందేమిరా - దానిరూపుజెరిపిం
తేపతేపకు-పాపనడిపిందేమిరా॥ వా॥

5 నియమనిష్టలులేకయెప్పుడు - సాముజేసిందే
సోమసూర్యుల - చాటనడపిందేమిరా॥ వా॥

6 తెలిసితెలియక వ్రాసితిని-దీని-తెల్లడించుముగురువరా - కొల్ల
లుగగొనియాడుచుంటిని - కోటిలింగగురువరా॥ వా॥

7 ఇంతరహస్యమెఱుంగజేసి - చింతదీర్చితిగురువరా - మంత
నంబునరామదాసుకు - మహితపదవియందెరా॥ వా॥

యదుకులకాంభోజిరాగం - అటతాళము.

పెద్దలనుచుజెప్పరాదు-పెద్దయెగ్గులవలెదిరిగెమొద్దులానెల్లా॥ పె॥

1 ఈషణత్రయమూలజిక్కి - చాలరోషపంతములాచే - రూఢి
గాంచనివారిగా॥ పె॥

2 కామాదులనుద్రుంచలేకా - బల్-నీమనిష్ఠలాచేసిగ్రేటివారిగా॥

3 వాదాములాడుచునెపుడూ - పాప-బాధలుమాన్పేటి - బోధ
దెలియనివారిగా॥ పె॥

4 గురుపులదూషింపుచుండీ-గుస్తు-నెఱుగకతిరిగేటిహీనులౌవారిగా॥

5 పెద్దలదారియెఱుగక-వారి-రద్దిపరచుచుబ-గ్గదరించెటివారిగా॥

6 పట్టువిషపులరెంటి - దెలియ-కట్టుమాటలచేత - పొట్టగడి
పేటివారిగా॥ పె॥

7 రంగైనయీతనువునందు - వెలుగు-లింగాన్నిగానక - పొంగి
తిరిగేటివారిగా॥ పె॥

8 ధరణిలోకోట్లింగగురునీ - పరమ-తారకనామమంత్రామెరు
గనివారిగా॥ పె॥

9 వాసిగానుయ్యూరిరామ - దాసు - వాసనదెలియక పరిహా
సించెడువారిగా॥ పె॥

నాదనామక్రియరాగం - అటతాళము.

బోధతెలుపుముగురునరా-మాబాధతీర్చుము గురువరా - గురు-
పాదములుపూజింతుమూ - గుణ - వాదములుజాలింతుము॥ బో॥

1 క... లిమాయలకు లోబడియుమేము - గానకుం... గురువరా-ముల...ర్గని

2 ...నట్టిగురు - స్మరణదెల్పుము గురువరా॥ బో॥

...దిక ఆశపెట్టిశత్రులార్గురు - మోసగించిరిగురువరా - ఆశత్రులను ...వ - మిాశ స్త్రోమిమ్ముగురువరా॥ బో॥

3 చదువుసంపదరూపయావన - కులమదంబుగురువరా - ఈథా త్రిలోపలమమ్ము జేరి - బాధపెట్టును గురువరా॥ బో॥

4 జపతపంబులు జేయలేకమిా - సరస జేరితి గురువరా - చప లముడిగేయుపము దెల్పి - కృపనుజూడుముగురువరా॥బో॥

5 తొమ్మిదిద్వారములకొంపను-నమ్మిచెడితిమిగురువరా- యిమ్మ హినికోటయమహాత్మ - యేలుము రామదాసునీ॥ బో॥

## మంగళహారతి.

సురటరాగము - అటతాళము.

మంగళం మంగళం - సద్గురునకు॥ మం॥

మంగళమనుచు - పుణ్యాంగనమణులెల్ల- పొంగుచుసంతోషమ మరగనూ - అంగనలెల్లాను- గంగయమునలమధ్య - శృంగారముగనున్న రంగైనగురునకు॥ మం॥

1 ఆధారస్వాధిష్ట మణిపూరచక్రముల-కాదిలోనాడేటి యార్యు నకూ - వాదభేదమువిడచి- బోధరూపకమైన సాధుసద్గురునకు- మేదినిలో జయ॥ మం॥

2 సగుణనిర్గుణమూల-సదసత్తులనుగాక-జగమంతానిండియు-సత్పు రుషుడై - గగనాతీతుడగుచు - గనులాకువశ్యుడై- యోగాతీతుడైనని త్యునకు జయ॥ మం॥

3 స్థిరముగకొల్లిపుర - వరమున వెలసిన - గురుకోటయార్యునీ కోరినిల్పి - సుఘచిరమదితోడ - పరమునోసగమని - నిరతముకామదాసు- మరువకగురునకు॥ మం॥ శ్రీ శ్రీ శ్రీ.

సర్వం శ్రీ సద్గురువార్పణమస్తు.

